**అష్టదిక్పాలకులు - గ్రహాధిపత్యము వలని శుభాఽశుభములు - అర్చణము**

మనము గ్రామ నిర్మాణ నిమిత్తము గాని, గృహనిర్మాణ నిమిత్తము గాని స్వీకరించిన స్థలమును వాస్తు క్షేత్రమందురు. అందలి వక్రతలను సంస్కరించి దిశలకు సరిపడునట్లు చేసిన, యది వాస్తువు యనబడును. అట్టి స్థలమునందు తూర్పు మున్నగు ప్రధాన దిశలు, ఆగ్నేయము మున్నగు మూలదిక్కులు కలసి అష్టదిక్కులను గుర్తింపగలము. అష్టదిక్పాలకులు ఆయా దిశలను సంరక్షింతురు. గృహారంభాదులకు ముందుగా (క్షేత్రపాలకులు) ను పూజించి, వారిని సంతృప్తి పరచి, వారి అనుగ్రహమును పొందగలము. అట్లే సూర్యుడు మొదలగు నవగ్రహములు ఆయా దిశలకు అధిపత్యము వహించియుందురు.

వీరిని మంటపారాధనమును జరిపి వారి అనుగ్రహమును కోరుచుందుము. క్షేత్రమునందు ప్రతి దిశకు దిక్పాలకుడు, ముఖ్యముగా ఆ దిశాధిపత్య గ్రహమును, వాని సహజ స్వభావ, కారకత్వముల ననుసరించి, క్షేత్ర దిశయందలి లోటు - పాట్లు ననుసరించి శుభప్రదముగా యున్న శుభఫలములను, అశుభప్రదముగాయున్న దుష్ట ఫలములను అందజేయును. ఒకపుడు ఇరు పార్శ్వముల యున్న గ్రహములను కొంత మేర ప్రభావితము చేయుచుండును. అటులనే యిరు పార్శ్వగ్రహముల యొక్క ప్రభావమునకు గురియై తదనుగుణ ఫలములను యిచ్చుటయు గలదు.

**తూర్పుదిశ :** తూర్పు దిక్కునకు పాలకుడు ఇంద్రుడు. అష్టదిక్పాలకులకు అధ్యక్షుడు. భోగము - అధికారము - యశస్సు కలిగించును. దిక్పాలకులకు కారకత్వములు లేవు. వారి సహజ స్వభావ లక్షణములు కలిగించును. తూర్పు దిక్కునకు అధిపతి సూర్యుడు. నవగ్రహకూటమికి రాజు. పురుషగ్రహము - అర్ధపాపి. అధికారము - గౌరవము - ఆయువు - ఆరోగ్యమును - వంశము - తండ్రి - సంతానము, ధనము, బంగారము మున్నగునవి వాని కారకత్వ ఫలములు. తూర్పు దిశ స్థలమునందు శుభత్వము కలిగియున్న, రవి ఆధిపత్యశుభుడై, తన శుభకారకత్వ ఫలముల నందజేయును. తూర్పు దిశ భ్రష్టమైన, రవి ఆధిపత్య పాపియై, తను అశుభమగు కారకత్వ ఫలముల నందించును. జ్యోతిష శాస్త్ర రీత్యా రవి సింహరాశికి అధిపతి. సింహలగ్న జాతకులకు వాని త్రికోణ రాశులగు మేష - ధనురాశులకు రవి ఆధిపత్య శుభుడైనందున, అట్టి రాశుల వారికి తూర్పు దిశ నివాసము శుభప్రదము. సింహరాశి నుండి 3-7-11-8-12 స్థానరాశుల జన్మించిన వారికి రవి ఆధిపత్య పాపియైనందున తూర్పు దిశ నివాసము కూడదు. అవర్గు వారికి తూర్పు దిశ నివాసము ప్రశస్తము. కవర్గు వారికి మధ్యమప్రదము. తవర్గు వారికి తూర్పు యోగ్యము కాదు. తూర్పు దిశ భ్రష్టమైన పురుష బలము తగ్గును. పుత్ర సంతతి యుండక పోవచ్చును. ఉన్నను ప్రయోజకులుకాక పోవచ్చును. యజమానికి గౌరవ - అధికారహాని - అనారోగ్యము కలిగించగలుగును. యవర్గు వారికి తూర్పు దిశ శుభప్రదమగును. అ వర్గువారికి 5వది యగు శత్రుదిశ యగు పశ్చిమము - దానితో సంబంధముగల 6వది యగు వాయువ్య దిశయు యోగ్యముకాజాలవు.

" దిక్షుశాలా ప్రకర్తవ్యా నవిదిక్షు కదాచన " - అని విదిక్కులు అర్వణమున్నను గృహనిర్మాణముకూడదు. స్వవర్గుయున్న దిశకు (4) - 5 - 6 దిశలు యందు నివాసము కూడదు. 1 - 2 - 3 - 7 వర్గులున్న దిశలు శుభప్రదమగును.

**ఆగ్నేయము :**

ఆగ్నేయ మూల దిశకు పాలకుడు అగ్నిదేవుడు. అగ్నితత్వము గలవాడు. అధిపతి శుక్రుడు. స్త్రీ గ్రహము కావున స్త్రీలపై ప్రభావము చూపును. తూర్పు, దక్షిణ దిశల

కలయిక గలది ఆగ్నేయము. కనుక తూర్పు అధిపతి యగు రవి - దక్షిణ దిక్కు అధిపతియగు కుజుడు అను అగ్నితత్వ పాపగ్రహముల మధ్య యుండి, వీరి ప్రభావము కొంత కలిగియుండును. శుక్రుడు - తల్లిని, జీవిత భాగస్వామి యగు భార్యను, ప్రియురాలును వివాహము, సంభోగము, స్త్రీ సమూహము, స్త్రీ ఆధిపత్యము, వస్త్ర, వాహన అలంకార, అందచందములు సూచించును. ఆకర్షణ కలిగించును.

ఆగ్నేయము భ్రష్టమైన శుక్రుడు ఆధిపత్యపాపియై, పై కారకత్వమునకు సంబంధించిన దోషఫలములు కలిగించును. స్త్రీలకు మానసిక వత్తిడి వావివరుసలు తప్పి బలత్కరింపబడుట పరస్పర స్త్రీ వైషమ్యములు. స్త్రీలకు దీర్ఘవ్యాధులు, నరముల బలహీనత - శస్త్ర చికిత్సలు - స్త్రీ పెత్తనము వహించుట, అవివాహితులు - భర్తను వదలిన వారు - విధవలుగా యుండి పుట్టింట యుండుట జరుగును. పురుషులు బలహీనులు త్రాగుబోతులు - జూదరులు - దరిద్రులు, వ్యభిచారులుగా యుండుట జరుగును. తూర్పు ఆగ్నేయము పురుషుల పైనను, దక్షిణ ఆగ్నేయము స్త్రీలపైనను, రెండవ సంతానముపై ప్రభావము కలిగించును.

శుక్రుని ఆధిపత్యరాశులు వృషభ - తులలు వీనికి, కోణరాశులగు 5 - 9 రాశుల వారికి, శుక్రుడు ఆధిపత్యశుభుడగును. 3-7-11 (8-12) రాశుల వారికి ఆధిపత్య పాపిగా యుండును. ఇట్టి రాశుల వారికి ఆగ్నేయము నివాస యోగ్యము కాదు. కవర్గు వారికి ఆగ్నేయము యోగ్యము. దానికి సంబంధముగల తూర్పు దిశ, నివాసమునకు, శుభప్రదము. పవర్గు వారికి శత్రుదిశయగుటచే ఆగ్నేయము కూడదు. కోణ (మూల) దిక్కుల నివాసము శ్రేయస్కరము కాదని, శాస్త్ర నిర్ణయము. ఇది సర్వులకు వర్తించును. క వర్గు వారికి 5వది శత్రుస్థానమగు వాయువ్యము, అది సంబంధము కలిగియున్న 4వదియగు పశ్చిమము, నివాసమునకు కూడదు.

**దక్షిణదిశ** : దక్షిణ దిక్పాలకుడు యముడు. ఆయువు తీరిన వెంటనే చంపువాడు. శిక్షించువాడు. దక్షిణ దిశ అధిపతి కుజుడు. పురుషగ్రహము 3/4 పాపి. అగ్ని తత్వపరాక్రమము గలవాడు. తమోగుణము - సాహసము - దుడుకు తనము, కోపము విజయకాంక్ష, కలహప్రియత్వము గలవాడు. అధికార కాంక్ష గలవాడు. స్థిర ఆస్థి - సోదరులు - వ్రణములు, గాయములు, ఎముకలు విరుగుట, మూత్ర రోగము, రక్తప్రకోపము, శస్త్రచికత్స, ప్రమాదములు, బలవన్మరణములు మున్నగునవి వాని కారకత్వములు.

దక్షిణ దిశ శుభప్రదముగాయున్న కుజుడు ఆధిపత్య శుభుడుగా పరిగణింపబడి తన కారకత్వ శుభఫలములనిచ్చును. దక్షిణ దిశ భ్రష్ఠమైనచో ఆధిపత్య పాపిగా యుండి కారకత్వ దుష్ఠఫలములనిచ్చును. భర్తకు దీర్ఘవ్యాధి, ఆర్థిక పతనము, ఋణబాధలు, శత్రుమూలక బాధలు, కోర్టు వ్యాజ్యములు ఆస్తులు జప్తు చేయబడుట, ఇల్లు అమ్ముకొని వెళ్ళిపోవుట, స్త్రీలకు సుఖము లేకపోవుట, మానసిక వ్యధనొందుట దుర్వ్యసనములకు లోనగుట, దుష్ఠసాంగత్యము శస్త్రచికిత్సలు, హింసాప్రవృత్తి, గౌరవహాని, కలుగుట సంభవించును. మధ్య వయస్సు వారికి ఆకస్మిక మరణములు కలుగును.

కుజుని ఆధిపత్యరాశులగు మేష, వృశ్చికములు వారికి, కోణరాశులు వారికి దక్షిణము శుభప్రదము. కుజ ఆధిపత్యరాశులకు 3-7-11-8-12 రాశుల వారికి కుజుడు ఆధిపత్య పాపి యగును. ఈ రాశులవారికి దక్షిణము నివాస యోగ్యము కాదు. చవర్గ వారికి దక్షిణము స్వస్థానము యోగ్యప్రదము. యవర్గ వారికి శత్రుదిశయగుటచే, దక్షిణము కూడదు. చవర్గ వారికి 5వదియగు ఉత్తరము శత్రుదిశయగుటకూడదు. 6వది యగు ఈశాన్యము ఉత్తరదిశతో సంబంధము కలిగియున్నందున కూడదు. విదిక్కులందు గృహనిర్మాణము కూడదు. ప్రధాన దిక్కులందు మాత్రమే అర్పణమున్న గృహనిర్మాణము యోగ్యమగును.

**నైరృతి** : నైరృతి మూలదిశ పాలకుడు నిర్పతి అను రాక్షసుడు, క్రూరుడు, రక్తపిపాసి, భక్షించుటకు వెనుకాడనివాడు. వానిని సంతృప్తిపరచిన సంతసించును. దక్షిణ, పశ్చిమ దిశలు కలిసి నైరృతి ఏర్పడినది. నైరృతిమూలకు అధిపతి రాహువు సహజపాపి. కుజుడు అను పాపగ్రహమునకు శనియను పాపగ్రహమునకు మధ్య, రాహువు గలడు. వారి ప్రభావము వీనిపై యుండును. రాహువు మ్లేచ్ఛుడు. నీచ జీవనము చేయు కులభ్రష్టుడు. సాంప్రదాయముల వర్జించినవాడు. మాతామహుడు, పితృమరణచింత, భ్రాతృనాశనము. శత్రు, ఋణ వ్యాధులు, తేలికగా దుర్మార్గ వర్తనచే ధన సంపాదనము దొంగ, జూదము, దుష్ఠ స్త్రీ సహవాసము, జైలు శిక్షననుభవించుట, సంతానలోపము దత్తత తీసుకొనుట, దేశాటనము, మత్తు పానీయసేవనము, మలమూత్రములు రాజభయము, కార్యవిఘ్నము, స్థానభ్రంశము, అపఖ్యాతి మున్నగు కారకత్వ లక్షణములు సూచించును. బయట పురుషుల పెత్తనం, ఇంట స్త్రీ పెత్తనమును కలిగియుండుటను, ఏదోవిధమున కార్యసాధనము చేయువారుగ నుందురు.

నైరృతి శుభప్రదముగాయున్న రాహువు ఆధిపత్యశుభుడై కారకత్వ శుభఫలములనిచ్చును. నైరృతి భ్రష్ఠమైన రాహువు ఆధిపత్య పాపియై కారకత్వ దుష్ఠ

ఫలితములు కలిగించును. ఆ యింట మగవారు, ఆడవారు అక్రమసంబంధములు కలిగి వ్యభిచరించడము లేచిపోవుట జరుగవచ్చును. పెద్ద కుమారుడు నిరుపయోగి, భ్రష్టుడగుట జరుగవచ్చును. బలవన్మరణములు జరుగుట, హంతకులై జైలు శిక్ష ననుభవించుట, పరువు ప్రతిష్ఠలు, కోల్పోవుట, ఆర్థికముగా చితికిపోవుట కుటుంబమున ఒకరినొకరు హత్య చేయుట జరుగవచ్చును.

నైరృతి రెండు దిశల కలయిక యగుట వలన, దక్షిణ నైరృతి స్త్రీలపైన ముఖ్యంగా ప్రథమ కుమార్తె పై ప్రభావము చూపును. పశ్చిమ నైరృతి పురుషులపైన ముఖ్యముగా ప్రథమపుత్రునిపై ప్రభావము చూపును.

రాహువునకు ఆధిపత్యరాశులు చెప్పబడలేదు. రాహువు యొక్క ఆధిపత్య నక్షత్రములు అర్ర్ధ, స్వాతి, శతభిషము యున్న రాశులగు మిధున, తుల, కుంభరాశులు, రాహువు స్వస్థానములుగా పరిగణింపబడినవి. అట్టి జన్మరాశుల వారికి రాహువు ఆధిపత్య శుభుడగును. వానికి కోణ స్థాన రాశుల వారికి నైరృతి దిశయోగ్యమగును. 3-7-11-8-12 రాశుల వారికిఇ రాహువు ఆధిపత్య పాపిగా యుండుటచే, నైరృతి నివాసయోగ్యము కాదు. టవర్గు వారికి నైరృతి స్వస్థానము యోగ్యమగును. వానికి సంబంధించిన దక్షిణ దిశ నివాస యోగ్యమగును. శవర్గు వారికి శత్రుదిశ యగుటచే నైరృతి కూడదు. టవర్గు వారికి 6వది తూర్పు శ్రేష్ఠము. 5వది ఈశాన్యము శత్రుస్థానము. ఉత్తరమునకు చెందియుండుటచే 4వది యగు ఉత్తరదిశ కూడదు.

**పశ్చిమదిశ :** పశ్చిమదిశ పాలకుడు వరుణుడు. పాశములచే బంధించువాడు జలాధిపతి. పశ్చిమదిశకు అధిపతి శని. పూర్ణపాపి. వాయుతత్వము గల నపుంసకగ్రహము. చురుకుదనము తక్కువ, వృద్ధునివలె కనిపించు వాడు సదా కష్టించి శ్రమచేయుట, క్రమనడవడి, మంచి ఆలోచనాశక్తి కలిగి యుండును. ఆయువు, మృత్యువు, తండ్రి, భార్య గతించినవాడు, భర్త గతించిన విధవ, స్థిరాస్థి, స్వతంత్రుడుగా యుండుటను సూచించును. గ్రామాధిపత్యము అంగవికలత, గర్భస్రావము. సంతతినష్టము, చెడుసహవాసము, జైలు శిక్ష, కులహీనత, మున్నగునవియు శని కారకత్వములు. పశ్చిమదిశ శుభప్రదముగా యున్న, శని ఆధిపత్య శుభుడై కారకత్వ శుభఫలములు సూచించును. పశ్చిమదిశ భ్రష్ఠమైన, శని ఆధిపత్య పాపియైవాని కారకత్వ దుష్ఫలముల నిచ్చును. యజమాని దుర్వ్యసనముల పాలయి అనారోగ్య వంతునిగా చేయును. అసమర్థునిగాను, ఉండియు లేనివాడుగా పరిగణింపబడును. యజమాని గతించవచ్చును. ఆడపెత్తనము యుండును. స్త్రీ సంతతి

అధికము. పెద్దలకు పక్షవాతం - పిల్లలకు పోలియో, మగపిల్లలు వృద్ధిలోకి రాజాలక పోవుట, సంతానము కష్టపడుట, మగసంతతి లేకపోవుట, ఇల్లు, స్త్రీ ఆస్తిగా మారుట జరుగును. యజమాని దారిద్ర్యబాధకు లోనగుట - దాస్య జీవనము. గౌరవము కోల్పోవుట, భార్యాపుత్రుల వలన హింసింపబడుట, కీళ్ళవాత వ్యాధులు పిశాచ అపమృత్యుభయములు కలిగించును.

శని అధిపత్యరాశులు మకర, కుంభములు. వీనికి కోణ రాశులు యందు జన్మించిన వారలకు శని అధిపత్యశుభుడై పశ్చిమ దిశ నివాస యోగ్యమగును. శని అధిపత్యరాశులకు 3-7-11-8-12 రాశుల వారికి శని ఆధిపత్య పాపిగా యుండుటచే పశ్చిమదిశ యోగ్యముగాదు. తవర్గు వారికి పశ్చిమ దిశ స్వస్థానము. కావున యోగ్యప్రదము. పవర్గు వారును పశ్చిమదిశయందు నివాసము యొప్పును. తూర్పుదిశ యందు నివాసము కూడదు. అవర్గు వారికి పశ్చిమము శత్రుదిశ యగుటచే కూడదు.

**వాయువ్యము** : వాయువ్యమూల దిక్పాలకుడు వాయుదేవుడు. పంచప్రాణములు వీని అధీనము. సదాసంచారి. నిలకడలేని చంచలచిత్తుడు. పశ్చిమ, ఉత్తర దిశలు కలయిక వలన వాయువ్య మూల ఏర్పడినది. దీని అధిపతి చంద్రుడు. శనియను పాపగ్రహము, బుధుడను శుభగ్రహమునకు మధ్యగల చంద్రునిపై వీరి ప్రభావము యుండును. చంద్రుడు స్త్రీ గ్రహము 30 సం..లోపు వయస్సుగల స్త్రీలపై ప్రభావము చూపును. తల్లి - మనస్సు స్త్రీ ధనము - సంతోషము - ఉద్యోగము - వివాదము - ఋణసమస్యలు - దూరప్రయాణము - నెయ్యి పాలు - ద్రవ పదార్థములు - అతినిద్ర - ఛాతి - ఊపిరితిత్తులు - రక్తము చంద్రుని కారకత్వములు. మానసిక చపలత - ఉన్మాదము - పిచ్చి - అస్మా - త్రాగుడు - అశబోతు - పిరికితనము - ఆకర్షణీయత చంద్రుని కారకత్వములు. పశ్చిమ వాయువ్యము పురుషులపైనను - ఉత్తరవాయవ్యము స్త్రీలపైన ప్రభావము చూపును. మూడవ సంతానముపై ప్రభావము చూపునందురు.

వాయువ్యము శుభప్రదముగా యున్నచో చంద్రుడు అధిపత్యశుభుడై, వాని శుభ కారకత్వ ఫలముల నిచ్చును. వాయువ్యము భ్రష్ఠమైన యెడల, చంద్రుడు అధిపత్య పాపియై దుష్ఫలితములనిచ్చును. ఉత్తర వాయువ్యము యింటి యజమానురాలు పైనను ముఖ్యముగా మూడవ స్త్రీ సంతానముపై ప్రభావము కలిగించును. మానసిక ప్రశాంతత లోపించును. అకారణ శత్రుత్వములు కలుగును. ఆర్థిక వత్తిడి, దొంగతనము, శత్రు బాధలకు గురియగుట, కోర్టు వ్యవహారముల చిక్కుకొనుట, దివాలా తీయుట, స్వస్థానము

వదలి వెళ్ళిపోవుట జరుగును. ప్రేమ వ్యవహారములు, ప్రేమ వివాహములు, లేచిపోవడం జరుగవచ్చును. దీర్ఘ రోగముల శ్వాసకోశ వ్యాధులకు గురికావచ్చును. చేపట్టిన పని కలిసిరాక పోవుట, పిచ్చిపట్టుట, అప్పు తీర్చుట కష్టమగుట, ఆస్తులు యిల్లు జప్తు లేక వేలం వేయబడుట జరుగవచ్చును. పశ్చిమ వాయవ్యము మూడవ పుత్రునిపైన యజమానిపైన ప్రభావము చూపును.

చంద్రుని అధిపత్యరాశి కర్కాటకము. వీని కోణరాశులగు వృశ్చిక, మీనముల జన్మించిన వారలకు - చంద్రుడు ఆధిపత్య శుభుడగుటచే, వాయవ్యము శుభప్రదమగును. 3-7-11-8-12 రాశులవారికి చంద్రుడు అదిపత్య పాపి యగుటచే వాయవ్యము కూడదు. పవర్గు వారికి వాయవ్యము స్వస్థానము శుభప్రదము. దీనికి సంబంధించిన పశ్చిమ దిశయును యోగ్యమగును. కవర్గు వారికి శత్రుదిశ యగుటచే వాయువ్యము కూడదు. పవర్గు వారికి 5వదియగు ఆగ్నేయము శత్రు దిశ యగును. అది సంబంధము కలిగియున్న 4వది యగు తూర్పు దిశ నివాసయోగ్యము కాదు.

**ఉత్తరదిశ :** ఉత్తరదిశ పాలకుడు కుబేరుడు. ఇతనికి ధనదుడు అని నామాంతరము గలదు. ధనమునకు అధిపతి. ధనమును రక్షించువాడు. ధనమును యిచ్చువాడు. ఉత్తర దిశకు అధిపతి బుధుడు. శుభగ్రహము. పురాణ రీత్యా వాయువ్యాధి పతి యగు చంద్రునికి, ఈశాన్యాధిపతియగు గురువు పత్నికి జన్మించి వాడు - నపుంసకుడు. మనోనిశ్చలత లేనివాడు. తరచు మార్పులకు లోబడు స్వభావి, శీఘ్ర గమనము గలవాడు. చేపట్టిన పనిని పూర్తిచేయకయే, మరియొక పనిని మధ్యలో చేపట్టు చంచలచిత్తుడు. విశ్రాంతి లేక శ్రమించువారు మంచి ప్రజ్ఞావంతుడు, స్వతంత్రశక్తి తక్కువ - యితరుల ఆధారమును అపేక్షించు వాడుగా యుండును. బుధుడు, తల్లియొక్క తండ్రిని, మేనమామ, అల్లుని వర్తక వ్యాపారములు, యుక్తి వ్యవహారముల సూచించును. మేనత్త, బావ, వంచన, బంధుమూలక ధనలాభము, ఉన్మాదము, చర్మవ్యాధి, పక్షవాతము, దేహపీడ నరముల బలహీనత, మున్నగునవి బుధుని కారకత్వలక్షణములుగా యున్నవి.

ఉత్తరదిశ శుభప్రదముగా యున్న బుధుడు అధిపత్యశుభుడై, తన కారకత్వ శుభఫలములను యిచ్చును. ఉత్తర దిశ భ్రష్టుపట్టిన, బుధుడు అధిపత్య పాపియై తన కారకత్వ దుష్ట ఫలముల నిచ్చును. ఉత్తర దిశ వాయువ్యమునందు స్త్రీలపైన ముఖ్యముగా 30 సం..ల లోపు యువతులపై ప్రభావము చూపును. దక్షిణ ఆగ్నేయమున 30 సం.. మించిన వయసుగల ఆడవారికి సూచించును. ఉత్తరము భ్రష్టమైన ఆస్తులు నశించును.

ఆర్థికముగా దెబ్బతినును. దివాలా తీయును. మానసిక ప్రశాంతత కోల్పోవును. గృహము అమ్మకము చేయుట జరుగును. యజమాని లేదా యజమానురాలు మరణించుట, యజమాని లేదా యజమానురాలు మందులకు తగ్గని దీర్ఘవ్యాధి అనారోగ్యములతో బాధ పడుట జరుగును. అల్లుని మూలకముగా హాని కలుగవచ్చును. గర్భస్రావములు వంటివి జరుగవచ్చును.

బుధుని ఆధిపత్యరాశులు మిధునము, కన్య. దీనికి కోణరాశుల యందు జన్మించిన వారికి బుధుడు ఆధిపత్య శుభుడగుటవలన ఉత్తర దిశ శుభప్రదమగును. బుధుని రాశులకు 3-7-11-8-12 రాశుల జన్మించినవారికి బుధుడు ఆధిపత్యపాపియగుటచే ఉత్తరము నివాస యోగ్యము కాదు. యవర్గు వారికి ఉత్తరము స్వస్థానము శుభప్రదమగును. చవర్గు వారికి శత్రు దిశయగుటచే ఉత్తరదిశ కూడదు. యవర్గు వారికి 5వదియగు దక్షిణము శత్రుదిశ నివాసము కూడదు. దానితో సంబంధము కలిగిన నైరృతి 6వదిగా యుండి నివాస యోగ్యము కాదు.

**ఈశాన్యము :** ఈశాన్యమూల దిక్కునకు పాలకుడు ఈశానుడు. ఈయనయే నిత్య పూజలయందుకొను పరమేశ్వరుడు. భూతేశుడు. శాశ్వితుడు - పవిత్రుడు. ఈయన సకల ఐశ్వర్యముల నిచ్చువాడు. ఈశాన్యమూల దిక్కునకు అధిపతి గురువు, మరియు కేతువు, **(బృహస్పతి)** గురువు పురుషగ్రహము. దైవభక్తి గలవాడు. ఆచార్యుడు, విద్య-పుత్ర-పౌత్ర-సంతానములనిచ్చును. సువర్ణము - భాగ్యము - ధన పశు సంపద కలిగించును. ప్రపితామహుని సూచించును - పురుషబలము. సదాచారము - శుభకార్యముల సూచించును. వాహనగండము - కర్ణరోగము - మెదడు వ్యాధి - అంధత్వము - కామెర్లు - లివరు - నంజు - గ్యాస్టిక్ ట్రబులు - వరిబీజము మున్నగు వ్యాధులు కలిగించును. కేతువు మోక్షమును - తాతను తీర్థయాత్ర వైరాగ్య బ్రహ్మవిద్య - మంత్రశాస్త్రముల సూచించును. వ్రణ - స్ఫోటకాది వ్యాధులను సూచించును. క్రిందపడుట, కోతలు గాయములు, తెగుటను కలిగించును.

తూర్పు - ఉత్తర దిశల కలయిక వలన ఏర్పడిన ఈశాన్యముపైన బుధ రవి ప్రభావము కొంత మేరకు యుండును.

ఈశాన్యమూల శుభప్రదముగాయున్న, గురువు ఆధిపత్యశుభుడై తన కారకత్వ ఫలముల నిచ్చును. ఈశాన్యము భ్రష్టుపట్టిన యెడల ఆ స్థలమునకు అధిక దోషము సూచించును. ఉత్తర ఈశాన్యము స్త్రీలపైన ధనముపైన - సంతానముపైన ప్రభావము

చూపును. తూర్పు ఈశాన్యము పురుషులపైన - అధికారము - గౌరవములు పైన ఆరోగ్యముపైన ప్రభావము చూపును. ఈశాన్యము భ్రష్ఠమైన - వంశమునకు హాని - భార్యభర్తలలో ఒకరు లేకుండుట - రెండు వివాహముల జరుగుట, సంతానము లేకపోవుట, దత్తుకుమారుడు వచ్చుట, స్త్రీ సంఖ్య ఎక్కువయున్నచో స్త్రీ ఆధిపత్యము. పురుషుల సంఖ్య తక్కువగా యున్నచో స్త్రీ విధేయులగుదురు. పురుషులు బలవంతులైన జైలుకు వెళ్ళుట - కోర్టు వ్యవహారముల చిక్కుకొనుట, ఆకస్మిక ప్రమాదములు, యాక్సిడెంటులకు గురియగుట జరుగవచ్చును. అచ్చట యున్న పురుషులు విద్యా ఉద్యోగ విషయముల వెనుకంజవేయుదురు. అన్యప్రాంతములకు వెళ్ళిన రాణింతురు. ఆర్థిక వత్తిడి కలిగియుందురు. తూర్పు ఈశాన్యము భ్రష్ఠమైన యజమానిపై గాని వాని జ్యేష్ఠ పుత్రునిపైన గాని ప్రభావము చూపి ఆకస్మిక మరణము - ప్రమాదము కలిగింపవచ్చును.

గురుని ఆధిపత్యరాశులు ధనస్సు - మీనము. వీనికి కోణరాశులగు మేష-సింహము-కర్కట-వృశ్చిక రాశుల జన్మించిన వారికి గురువు ఆధిపత్య శుభుడైనందున, ఈశాన్యము శుభప్రదముగా యుండి యోగ్యమగును. గురుని ఆధిపత్యరాశుల నుండి 3-7-11 (8-12) రాశుల వారికి గురువు ఆధిపత్యపాపి యగుటచే ఈశాన్యము నివాస యోగ్యము కాదు.

శవర్గు వారికి ఈశాన్యము స్వస్థానము. యోగ్యప్రదమగును. దానికి సంబంధముగల ఉత్తర దిశయందును నివాస యోగ్యమగును. అది మధ్యమప్రదము.

టవర్గు వారికి శత్రు దిశ యగుటచే ఈశాన్యము నివాసమునకు కూడదు. శవర్గు వారికి 5వది నైర్రుతి శత్రుదిశ యగుట నివాసము కూడదు. దానికి సంబంధముగల 4వదియగు దక్షిణమును కూడదందురు.

కేతువు ఈశాన్యమునకు గురువుతోపాటు ఆధిపత్యము కలిగియున్నాడు. కేతువునకు ఆధిపత్యరాశులు చెప్పబడలేదు. కావున కేతువు యొక్క ఆధిపత్య నక్షత్రములగు అశ్విని - మఘ - మూల నక్షత్రములున్న రాశులగు మేషము - సింహము - ధనస్సు ఆధిపత్య రాశులుగా పరిగణింపదగినవి. ఈ రాశులందు జన్మించిన వారికి కేతువు ఆధిపత్య శుభుడు. ఈశాన్యమున నివాసము శుభఫలములనిచ్చును. వీనికి 3-7-11(8-12) రాశుల వారికి లేక ఆధిపత్య పాపియగును. ఈశాన్యము భ్రష్ఠమైన కేతువు దుష్ఠ ఫలములను సూచించును.